| | |
|---|---|
| భోగావలీ వందిపాఠః | భోగావలీ ౧, వందిపాఠః ౨ ఇవి స్తోత్రపాఠము పేరులు. |
| సేతుః పూరణపిండలో, | సేతుః ౧, పూరణపిండలీ ౨ ఇవి సేతువు పేరులు. |
| దేవద్రోణీ దేవయాత్రా | దేవద్రోణీ ౧, దేవయాత్రా ౨ ఇవి పుణ్యక్షేత్ర యాత్ర పేరులు. |
| శూనాధో జిహ్వికా మతా. | శూనా ౧, జిహ్వికా ౨ ఇవి ఉలూఖలము మొదలగు అయిదుపాపముల పేరులు. |
| పాలిః సముత్థితశ్మశ్రు | పాలిః ౧ సముత్థితశ్మశ్రు = మొలచిన గడ్డముగల ఆఁడుది. |
| ర్మరుండోచ్చలలాటికా, | మరుండః ౧, ఉచ్చలలాటికా ౨ ఇవి పెద్దకనుబొమ్మలుగలదాని పేరు. |
| రాకాదృష్టరజాః కన్యా | రాకా ౧, దృష్టరజాః కన్యా = రజస్వలయైన స్త్రీ. |
| పోటా స్త్రీపుంసలక్షణా. ౨౩౦ | పోటా (సీ) స్త్రీ పుంసలక్షణా=పురుషలక్షణములు స్త్రీలణములుగల స్త్రీ పేరు. |
| మహత్తరో గ్రామకూటో | మహత్తరః ౧, గ్రామకూటః ౨ ఇవి గొప్పవానికి పేర్లు. |
| మర్మరోఽవ్యక్తనిస్స్వనః, | మర్మరః ౧, అవ్యక్తనిస్స్వనః ౨ ఇవి అస్పష్టధ్వని పేరులు. |
| శివాలయః పితృవనం | శివాలయః ౧, పితృవనం ౨ ఇవి శ్మశానము పేరు. |
| చితా కాష్ఠమతీ చితిః. | చితా ౧, కాష్ఠమతీ ౨, చితిః 3 ఇవి కాష్ఠము పేరులు. |
| కర్ణవంశో భవేన్మంచః | కర్ణవంశః ౧, మంచః ౨ ఇవి మంచము పేరు. |
| శ్రీగ్రహాః శకునిప్రపా, | శ్రీగ్రహాః ౧ శకునిప్రపా ౨ ఇవి పక్షులకు నీరుపోయుశాల. |
| తాంబూలదో వాగులికః | తాంబూలదః ౧ వాగులికః ౨ ఇవి తాంబూలము లిచ్చువాని పేరులు. |

సురభిః ఫాల్గునానుజః. సురభిః ౧, ఫాల్గునానుజః ౨ ఇవి వసంత కాలము పేరులు.

తాంబూలరాగో మసుర తాంబూలరాగః ౧, మసురః ౨ ఇవి తాంబూలరాగము పేరులు.

స్తరువారిః కృపాణకః, తరువారిః ౧, కృపాణకః ౨ ఇవి ఖడ్గము పేరులు.

స్వాగతం కుశలప్రశ్నః స్వాగతం ౧ కుశలప్రశ్నః ౨ ఇవి కుశలప్రశ్నము పేరులు.

సామీంచీవందనా మతా. సామీంచీ ౧, వందనా ౨ ఇవి స్తుతి పేరులు.

సముద్గః సంపుటో జ్ఞేయో సముద్గః ౧, సంపుటః ౨ బరిణె పేరు.

హయస్కంధో హయచ్ఛటా హయస్కంధః ౧, హయచ్ఛటా ౨ గుఱ్ఱముమూంపుజూలు పేరు.

పిండారో మహిషీపాలే పిండారః ౧, మహిషీపాలే = గేదెలఁ గాయువాఁడు.

మసూరే చ గభోలికః. మసూరః ౧, గభోలికః ౨ చిలుసెనగలు.

కాహలీ తరుణీ ప్రోక్తా కాహలీ ౧, తరుణీ ౨ యౌవనవంతురాలు.

ఛురా తు కథితా సుధా, ఛురా (స్త్రీ) ౧, సుధా ౨ సున్నము.

కాంపిల్లికా రోచనికా కాంపిల్లికా ౧, రోచనికా ౨ గోరోజన విశేషము పేరులు.

కాలికా వస్కరాటికా. కాలికా ౧, వస్కరాటికా ౨ తేలు.

కాలికా క్షీరకీటః స్యాత్ కాలికా ౧ క్షీరకీటః ౨ ~~పాలలోని పురుగు.~~ ఏబ్బె పురుగు

ఖండపాలస్తు ఖాండికః ఖండపాలః ౧, ఖాండికః ౨ బెల్లకుడుము. Bot.

పాంశురః పీతసర్పి స్స్యాత్ పాంశురః ౧, పీతసర్పి ౨ తూంటివాఁడు. దేకేవాడు ౹౹ ఆఖిటివాడు

ధల్లలో రోమశః స్మృతః. ధల్లలః ౧, రోమశః ౨ దేహమునిండ రోమములు గలవాఁడు.

హ

| | |
|---|---|
| పూగపాత్రే ఫరువకం | పూగపాత్రం ౧, ఫరువకం ౨ పోకలు పెట్టు పళ్లెము. |
| కబంధో రుండ ముచ్యతే | కబంధః ౧, రుండం ౨ తలలేని మొండెము. (తల) |
| తూలికా స్యా న్నవతికా, | తూలికా ౧, నవతికా ౨ బొమ్మలు వేయు కుంచెపేరు. |
| స్త్యానమాలస్యముచ్యతే. | స్త్యానం ౧, ఆలస్యం ౨ ఆలస్యము పేరు. |
| భాజనే కమఠం ప్రోక్తం | భాజనం ౧, కమఠం ౨ భిక్షాపాత్రము. |
| పుణ్యశ్లోకో నలో మతః. | పుణ్యశ్లోకః ౧, నలః ౨ నలమహారాజు. |
| గౌరవే ప్రతిపత్తిః స్యా ద్ధ్వారిః పథికసంహతిః | గౌరవః ౧, ప్రతిపత్తిః ౨ గౌరవభావము. |
| యామకిన్యపి యామిస్త్రీ | యామకిని ౧, యామిస్త్రీ ౨ గస్తీ తిరుగు స్త్రీపేరు. |
| హాఫికా చోపపుష్పికా. | హాఫికా ౧, ఉపపుష్పికా ౨ ఆవలింత పేరు. |
| వాతపుత్రే విటధరా | వాతపుత్రః ౧, విటధరీ ౨ మహాధూర్తుడు. |
| నిర్మాల్యం నిర్మలం మతం. | నిర్మాల్యం ౧, నిర్మలం ౨ పరిశుద్ధమైనది. |
| ఇంద్రాసనే మతా గుంజా | ఇంద్రాసనం ౧, గుంజా ౨ చౌటిపట్టి పేరు. |
| గులుంఛో గుచ్ఛకో మతః, | గులుంఛః ౧, గుచ్ఛకః ౨ పూలగుత్తి, |
| భోగావాసో వాసగృహం | భోగావాసః ౧, వాసగృహం ౨ శయనగృహము. |
| మేంఠో హాస్తిపకః స్మృతః. | మేంఠః౧హాస్తిపకః౨ మావటివాడు. |
| మాయుః పలాగ్నిః పలలం జ్వరస్యా | మాయుః ౧, పలాగ్నిః ౨, పలలం ౩, జ్వరం 3 పైత్యము. |

దజీర్ణమంత్రే థమి రామయ
శ్చ.

మిరామయః ౧, అజీర్ణమంత్రే=అజీర్ణమంత్రము.

తృప్తిశ్చ సౌహిత్యముదం
తికా స్యాత్

తృప్తిః ౧, సౌహిత్యం ౨, ఉదంతికా ౩ తృప్తిపేర్లు.

క్షుత్క్షారికా భోగపిశా
చికా చ. ౧౪౧

క్షుత్ ౧, క్షారికా ౨, (స్త్రీ) ౩ భోగపిశాచికా ఆకలిపేరులు.

మోఘో జలవరంటః స్యా

మోఘః ౧, జలవరంటః ౨ జలవసంతమను వ్రణము.

త్కణా కుంభీరమక్షికా,

కణా ౧, కుంభీరమక్షికా ౨ నూటిపట్టుఈగ.

వహాలం వార్భటః పోత

వహాలం ౧, వార్భటః ౨, పోతః ౩ పడవపేరులు.

స్తరాలుశ్చాహిపుత్రకః.

తరాలుః ౧, అహిపుత్రకః ౨ నౌకావిశేషము.

కాహాలస్తు మహానాదో

కాహాలః ౧, మహానాదః ౨ పెద్దఢక్కపేరు.

మార్దంగం పత్తనం విదుః

మార్దంగం (న) ౧ పత్తనం ౨ పట్టణముపేరు.

స్యాదరిత్రం తరిరథ
పాత్రపాలస్తులాధటః.

అరిత్రం ౧, తరిః ౨ ఓడతెడ్డు.

పాత్రపాలః ౧, తులాధటః ౨ తక్కెడ దండె

కాకినీ పణతుర్యాంశే

కాకినీ ౧, పణతుర్యాంశే=కర్షమెత్తు తామ్రనాణెములో నాలుగవ భాగము.

జ్వాలదంగార ఉల్ముకం,
అయనం చ స్వభావః స్యా

జ్వాలదంగారః ౧ ఉల్ముకం ౨ కొఱివి.

అయనం ౧, స్వభావః ౨ స్వభావము పేర్లు.

న్మంజికా వారసుందరీ.

మంజికా ౧, వారసుందరీ ౨ ఇవి వేశ్యపేరులు.

నీలమణిర్మసారః స్యా

నీలమణిః ౧, మసారః ౨ ఇవి ఇంద్రనీలము పేరులు.

| | |
|---|---|
| ద్గుంజా పారిహికామతా | గుంజా ౧, పారిహికా ౨ పూసల గురువింద పేరు. |
| భార్యా పాణిగృహీతీ చ | భార్యా ౧, పాణిగృహీతీ (ఈ. సీ) ౨ ఇవి భార్య పేరులు |
| దుకూలం క్షౌమ ముచ్య తే. ౧౮౫ | దుకూలం ౧, క్షౌమం ౨ ఇవి పట్టు బట్ట. |
| గ్రంథస్య నిర్మితౌ శయ్యా | శయ్యా (ఆ. సీ) ౧ గ్రంథనిర్మాణవిధము. |
| వధూటీ వధుటీజనే | వధూటీ, (సీ) ౧ వధుటీ ౨ ఆఁడుది. |
| బందిచోరో మాచలస్స్యా | బందిచోరః ౧, మాచలః ౨ కారా గృహములోని దొంగ పేర్లు. |
| త్కుంభిలస్సంధిహారకః. | కుంభిలః ౧, సంధిహారకః ౨ కన్నపు దొంగ పేరు. |
| అభ్రము స్త్వభ్రనాగస్య | అభ్రముః ౧ ఐరావతము భార్య పేర్లు. |
| కుముదస్య తు పింగళా, | పింగళా ౧, కుముదమను దిగ్గజపత్ని పేరు. |
| అంగనా వామనస్య స్యా | అంగనా ౧, వామనమను దిగ్గజము భార్య పేరు. |
| దంజనస్యాంజనావతీ. | అంజనావతీ ౧, అంజనమను దిగ్గజ భార్య పేరు. |
| కపిలా పుండరీకస్య | కపిలా ౧, పుండరీక దిగ్గజము భార్య పేరు. |
| అనుపమా సుప్రతీకస్య | అనుపమా ౧ సుప్రతీకము భార్య పేరు. |
| శేషస్య తామ్రకర్ణీ చ | తామ్రకర్ణీ ౧ శేషదిగ్గజపత్ని పేరు. |
| శుభ్రదంతీ సార్వభౌమ స్య. ౧౮౬ | శుభ్రదంతీ ౧ సార్వభౌమమను దిగ్గజ పత్ని పేరు. |
| సేవా చాటూక్తి రాలో కః | సేవా ౧, చాటూక్తిః ౨, ఆలోకః 3 సేవ చేయుట. |
| మతోఽగంత్రీరథః స్మృతః, | అమతః ౧, గంత్రీరథః ౨ పెంటమోయు బండి పేర్లు. |

| | |
|---|---|
| చిపిటో ధాన్యచమసః | చిపిటః ౧, ధాన్యచమసః ౨ అటుకులు. |
| ఖాజికో లాజి ఉత్తుషః. | ఖాజికః ౧, లాజిః ౨, ఉత్తుషః 3 పేలాలు. |
| అభ్యాసో గుణనీయఃస్యా | అభ్యాసః ౧, గుణనీయః ౨ అలవాటు పేరు. |
| న్మాఢిః పత్రశిరా మతా. | మాఢిః ౧, పత్రశిరా ౨ మకరికా పత్రాదులు. |
| భౌతో దేవలకఃఖ్యాతః | భౌతః ౧, దేవలకః ౨ పూజారివాఁడు |
| ఖేటకం వసునందకే | ఖేటకం ౧, వసునందకః ౨ డాలు. |
| పురందరా తు సురలా | పురందరా (స్త్రీ) ౧, సురలా ౨ గంగానది. |
| కావేరీ చార్ధజాహ్నవీ, | కావేరీ ౧, అర్ధజాహ్నవీ ౨ ఇవి కావేరీనది పేరులు. |
| కౌముదః కార్తికోమాసః | కౌముదః ౧, కార్తికః ౨ ఇవి కార్తిక మాసము పేరులు. |
| సౌభిక స్త్వింద్రజాలికః. | సౌభికః ౧, ఇంద్రజాలికః ౨ ఇవిగారడివాని పేళ్లు. |
| ప్రహేలకం వాచనకం | ప్రహేలకం ౧, వాచనకం ౨ గూఢార్థకావ్యము. |
| వీక్షాపన్నస్తువిస్మయః, | వీక్షాపన్నః ౧,విస్మయః ౨ ఆశ్చర్యము |
| కుటలం పటలం నీవ్రం | కుటలం ౧, పటలం ౨, నీవ్రం 3 ఇంటిచూరు. |
| వీథీగృహతటీమతా౧౫౫ | వీథీ(ఈ.స్త్రీ.) ౧, గృహతటీ ౨ బజారు. |
| సర్వవేశీ నటః ప్రోక్తో | సర్వవేశీ (న్.పు)౧,నటః౨ నర్తకుఁడు. |
| మందాకే తు నటాంతికా, | మందాకః౧, నటాంతికా ౨ సిగ్గు. |
| మృత్ఫలీ కుకికః ప్రోక్తో | మృత్ఫలీ (న్. పు) కుకికః ౨ కుష్ఠువ్యాధి. |
| శాలూరో వృష్టిభూః ప్లవః. ౧౫౩ | శాలూరః ౧, వృష్టిభూః (ఊ.పుం) ౨, ప్లవః 3 కప్ప. |

| | |
|---|---|
| స్వేదః సిప్రస్తనురస | స్వేదః ౧, సిప్రః ౨, తనురసః 3 ఇవి చెమట పేరులు. |
| స్త్వక్పుష్పం తు త్వగంకురః, | త్వక్పుష్పం ౧, త్వగంకురః ౨ గగుర్పాటు. |
| నవోఢా నవవారికా | నవోఢా ౧, నవవారికా ౨ ముగ్ధ నాయిక. |
| దిక్కరీ నవయౌవనా. | దిక్కరీ (ఈ. సీ) నవయౌవనా ౨ నూతనయౌవనవతి. |
| సౌవర్చలే చ రుచకం | సౌవార్చలః ౧, రుచకం ౨ సౌవార్చలవణము. |
| హింగులే రక్తపారదం, | హింగులం ౧, రక్తపారదం ౨ ఇంగిలీకము. |
| రక్తోపలం గైరికే చ | రక్తోపలం ౧, గైరికం ౨ గైరిక ధాతువు. |
| పారదే సూతకం విదుః. | పారదం ౧, సూతకం ౨ ఇవిపాదరసము పేళ్లు. |
| సాశూకః కంబలః ఖ్యాత | సాశూకః ౧, కంబలః ౨ కంబడి. |
| ఊమాత్వక్కండురో వ్రణః, | ఊమా ౧, త్వక్కండురః ౨ వ్రణః 3 వ్రణము. |
| కపటఃపారిహార్యఃస్యాత్ | కపటః ౧, పారిహార్యః ౨ మోసము. |
| ఈర్ష్యాలుః కుహనః స్మృతః. ౧౫౮ | ఈర్ష్యాలుః ౧, కుహనః ౨ ఇవి అసూయాపరుని పేరులు. |
| ఋణమోక్షే విగణనం | ఋణమోక్షం ౧, విగణనం ౨ ఋణ విముక్తి. |
| లగ్నకే ఋణమార్గణః, | లగ్నకః ౧, ఋణమార్గణః ౨ పూటకాపు. |
| భిక్షాశిత్వం తు పైశూన్యం | భిక్షాశిత్వం ౧, పైశున్యం ౨ బిచ్చముతో బ్రదుకుట. |
| మండః పిచ్ఛాంధస స్తథా. | మండః ౧, పిచ్ఛాంధసః ౨ గంజిపరక పేరు, |

| | |
|---|---|
| వాయుకేతుః తుతికణః | వాయుకేతుః ౧, తుతికణః ౨ ధూళి. |
| స్యా దాస్ఫాలే ఝులర్ఝులా | ఆస్ఫాలః ౧, ఝులర్ఝులా ౨ ఏనుగు చెవి కొట్టుకొనుట. |
| నష్టాప్తిసూత్రే లోప్త్రం స్యా | లోప్త్రం ౧ ఇది నష్టాప్తిసూత్రే = దొంగిలింపఁబడినసొమ్ము. |
| ద్యాప్యయానం శిబీరథః. | యాప్యయానం ౧, శిబీరథః ౨ పల్లకి. |
| మల్లయాత్రా మాల్లవీ స్యా | మల్లయాత్రా (అ.సీ) ౧ మాల్లవీ ౨ మల్లురుయుద్ధమున కేగుట. |
| న్నిర్భర్త్సనమలక్తకః. | నిర్భర్త్సనం ౧, అలక్తకః ౨ లక్క. |
| కౌశలికా ప్రాభృతక | కౌశలికా ౧ ప్రాభృతకం ౨ కానుక. |
| మ్మట్టకం లాసకం విదుః, | మట్టకం ౧, లాసకం ౨ గృహశిరోభాగము. |
| స్వదోషాచ్ఛాదనం మఠః | స్వదోషాచ్ఛాదనం ౧, మఠః ౨ ఇవి తనతప్పు కప్పిపుచ్చుటకు పేరులు. |
| శ్చూల్లీ స్యాన్మలకారికా. | చూల్లీ ౧,మలకారికా ౨పాయ్యిపేరు. |
| వాతాశ్వో భూమిపక్షః | వాతాశ్వః ౧, భూమిపక్షః ౨ కులనాశ్వము. |
| స్యా ద్దారుర్విజయకుంజరః, | దారుః ౧, విజయకుంజరః ౨ రాజెక్కు ఏనుగు. |
| ప్రభాతే గోసగోసర్గావం జనీలేపకామినీ. | ప్రభాతం ౧, గోసః ౨, గోసర్గః 3 వేకువకాలము. |
| ఉత్కటో గండకుసుమం | ఉత్కటః ౧, గండకుసుమం ౨,హాస్తిమదము. |
| సిద్ధ స్సౌమేధికో మతః, | సిద్ధః ౧, సౌమేధికః ౨, మంచిమేధగలవాడు. |
| వృషాకపిః శిఖీ శుష్మా | వృషాకపిః ౧, శిఖీ (న్.పు) ౨, శుష్మా 3 అగ్ని. |
| భస్మపార్ఘటమర్ఘటం. | భస్మ ౧, పార్ఘటం ౨, అర్ఘటం 3 బూడిదె. |

| | |
|---|---|
| [ఉష్ట్రివాహీమీరథో ద్యు ష్ట్రిగంత్రలక్ష్మీద్వివేశిరా,] | (?) |
| కృకణః కృమిరుద్దిష్టః | కృకణః ౧, కృమిః ౨ ఇవి పురుగు పేరులు. |
| శకృత్కీటోఽన్యకారుకా. | శకృత్కీటః ౧, అన్యకారుకా ౨ ను లిపురుగులు? మలభక్షణచేయు పురుగులు. |
| భారవాహో భారికస్స్యా | భారవాహః ౧, భారికః ౨ బరువుమోయు కూలివాఁడు. |
| త్స్కంధచాపో విహంగికా. ౧౬౩ | స్కంధచాపః ౧, విహంగికా ౨ కావడిబద్ద. |
| ఉన్నతోఽజగరః ప్రోక్తో | ఉన్నతః ౧, అజగరః ౨ ఇవి కొండచిలువ పేరులు. |
| ద్విముఖాహిరహీరణిః, | ద్విముఖాహిః ౧, అహీరణిః ౨ ఇవి రెండు తలలపాము పేరులు. |
| పురోటిః పురసంస్కారే | పురోటిః ౧, పురసంస్కారః ౨ నగరాలంకారము. |
| హట్టీ పురతటీ మతా. | హట్టీ ౧, పురతటీ ౨ అంగడివీధి. |
| మృణాలినీ పుటకినీ | మృణాలినీ(-ఈనీ)౧,పుటకినీ౨ పద్మలత. |
| స్థాసకో బుద్బుదోభవేత్, | స్థాసకః ౧, బుద్బుదః ౨ ఇవి నీటిబుడగ పేరులు. |
| కలాచికా ప్రకోష్ఠః స్యా | కలాచికా ౧, ప్రకోష్ఠః ౨ మోచేయినుండి మణికట్టుపఱకు. |
| ద్ధస్తపుచ్ఛస్తు కస్యుషమ్. | హస్తపుచ్ఛః ౧, కన్యుషం ౨ హస్తావయవములు (వ్రేళ్లు) |
| ఉత్సాహః సూత్రతంతుః స్యా, | ఉత్సాహః ౧, సూత్రతంతుః ౨ మంగళసూత్రము |
| త్పిండీరో నీరసస్స్మృతః | పిండీరః ౧, నీరసః ౨ ఇవి సారహీనమైన దానిపేరులు. |
| హారిణహృదయో భీరుః | హారిణహృదయః ౧, భీరుః ౨ ఇవి పిరికివానికి పేరులు. |

| | |
|---|---|
| సందేశోక్తిస్తు వాచికం. | సందేశోక్తిః ౧, వాచికం౨ సంవాదము. |
| శాలాజిరో వర్ధమానం | శాలాజిరః ౧, వర్ధమానం ౨ మూకుడు. |
| కుసీదం తు కలాంబికా, | కుసీదం ౧, కలాంబికా ౨ అప్పు ఇచ్చుట. |
| చర్పా తలప్రహారః స్యా | చర్పా ౧, తలప్రహారః ౨ చెంపదెబ్బ పేరు. |
| త్కర్కరం ముద్గరం విదుః. ౧౬౭ | కర్కరం ౧, ముద్గరం ౨ ఆయుధవిశేషము (ఇనుపగుదియ.) |
| గోష్ఠాగారేఽపి గంజః స్యా | గంజః ౧, గోష్ఠాగారే=ఖజానాకొట్టు. |
| చ్చింతావేశ్మని దార్వటం | దార్వటం ౧, చింతావేశ్మని=రహస్యాలోచనగృహము. |
| మానగ్రంధిర్భవేన్మంతు | మానగ్రంధిః ౧, మంతుః ౨ అపరాధము. |
| ర్నిష్కుటో గృహవాటికా. ౧౬౮ | నిష్కుటః ౧, గృహవాటికా ౨ గృహమందలితోట. |
| శైలస్య కటకే దంత | దంతః ౧, శైలస్య కటకే=కొండచరియ. |
| స్తద్దినం ప్రతివాసరే, | తద్దినం ౧, ప్రతివాసరే=ప్రతిదివసము. |
| సూత్రమేవ సూత్రతంతుః | సూత్రం ౧, సూత్రతంతుః ౨ జందెము. |
| కృశరాపి తిలౌదనే. ౧౬౯ | కృశరా ౧, తిలోదనే ౨ నువ్వుల పులగము. |
| స్యాదాసవోఽపి కురసః | ఆసవః ౧, కురసః ౨ మద్యము. |
| సరకం మద్యభాజనే, | సరకం ౧, మద్యభాజనే=కల్లుకుండ. |
| నిశ్చుక్కణం దంతశాణం | నిశ్చుక్కణం ౧, దంతశాణం ౨ పండ్లపొడి పేరు. |
| గోగ్రంధిః శుష్కగోమయే. | గోగ్రంధిః ౧, శుష్కగోమయే=ఎండిన ఆవు పేడ పేరు. |
| అష్టాపదం నయపీఠీ | అష్టాపదం ౧, నయపీఠీ ౨ సొగటాలపాళి. |
| నయస్తు జతుపుత్రకః | నయః ౧, జతుపుత్రకః ౨ ద్యూతవిశేషము. |

విందుతంత్రో ఖ వేదకః — విందుతంత్రః ౧, అకః ౨ పాచికలు.

పాంచాలీ శాలిశృంఖలా. — పాంచాలీ ౧, శాలిశృంఖలా ౨ సొగటాల సారె.

ప్రస్తార స్తలినం శయ్యా — ప్రస్తారః ౧, తలినం ౨, శయ్యా ౩ శయ్య.

రోమగుచ్ఛః ప్రకీర్ణకం, — రోమగుచ్ఛః ౧, ప్రకీర్ణకం ౨ చామరము.

శివా లోపాశికా జ్ఞేయా — శివా ౧, లోపాశికా ౨ ఆఁడునక్క.

సరమా తుంబురీ శునీ. — సరమా ౧, తుంబురీ ౨,శునీ ౩ ఆఁడుకుక్క.

పాదాంగదీ హంసకః స్యా — పాదాంగదీ ౧, హంసకః ౨ కాలికడియము.

త్ప్రతికర్మ ప్రసాధనం, — ప్రతికర్మ ౧, ప్రసాధనం ౨ మకరికాపత్రరచన.

కర్ణపాలీ తు కర్ణాందూ — కర్ణపాలీ ౧, కర్ణాందూః ౨ చెవికమ్మ పేరు.

రంగులీయకమూర్మికా. — అంగులీయకం ౧, ఊర్మికా ౨ ఉంగరము.

ఖాతభూః ప్రతిరూపః స్యా — ఖాతభూః ౧, ప్రతిరూపః ౨ అగడ్త.

ల్లంభా స్యాన్నాటశృంఖలా, — లంభా ౧, నాటశృంఖలా ౨ త్రోవనడ్డగించు గేటు.

కంధరా తోరణం కంటీ — కంధరా ౧, తోరణం ౨, కంటీ ౩ కంటె పేరులు.

సూత్రాలీ గలమేఖలా. — సూత్రాలీ ౧, గలమేఖలా ౨ కంఠసూత్రము.

శాసనం ధర్మకీలః స్యా — శాసనం ౧,ధర్మకీలః ౨ రాజశాసనము

త్సత్కృతం శూద్రశాసనం — సత్కృతం ౧, శూద్రశాసనం ౨ శూద్రుని ఆజ్ఞ.

పట్టోలికా క్లప్తకీలా — పట్టోలికా ౧, క్లప్తకీలా ౨ వ్యవస్థాపత్రము.

సింధూరం ర_క్తశాసనమ్. సిందూరం ౧, ర_క్తశాసనం౨ సిందూ రము పేళ్లు.

రాసస్తు గోదుహం క్రీడా రాసః ౧, గోదుహం ౨ క్రీడా 3 గోపాలుర క్రీడావిశేషము.

గీతిః పారావతీ తథా, గీతిః ౧, పారావతీ ౨ గోపకులగీతము.

వేణుర్యవఫలో వంశో వేణుః ౧, యవఫలః ౨ వంశః 3 వెదురు పేరు.

నవీనే నవకాలికా. ౧౭౬ నవకాలికా ౧ నవీనే=క్రొత్తగ చేసినది.

ముఖఘంటా హులహులీ ముఖఘంటా ౧, హులహులీ ౨ స్త్రీల మంగళజనకమగు ముఖశబ్దము.

తలాచీనలపట్టికా తలాచీ ౧, నలపట్టికా ౨ కిక్కసగడ్డి చాప.

నీపోధ రాకదంబః స్యా నీపః ౧, ధరాకదంబః ౨ మొగలుకడిమిచెట్టు.

ద్వీరభద్రస్తు వీరణం. వీరభద్రః ౧, వీరణం ౧ అవురుగడ్డి.

ఖడ్గటస్తు బృహత్కాశం ఖడ్గటః ౧ బృహత్కాశం ౨ పెద్ద రెల్లు.

కోశాంగమిత్కటం విదుః కోశాంగం ౧, ఇత్కటం ౨ కోశాంగమునకు పేరు.

గండీరస్తు సమంతః స్యా గండీరః ౧, సమంతః ౨ ఏరువంగ చెట్టు

ద్ధ్రీబేరం వారివాలకమ్. హ్రీబేరం౧, వారివాలకం ౨కురు వేరు.

శితోత్పలం గంధసోమం శితోత్పలం ౧, గంధసోమం ౨ తెల్ల కలువ.

హరిమంథోఽతిము_క్తకః, హరిమంథః ౧, అతిము_క్తకః ౨ నెమ్మి చెట్టు.

కర్కారుకస్తు కాలింగః కర్కారుకః ౧, కాలింగః ౨ పుచ్చ చెట్టు.

శృంగాటో జలకంటకః. శృంగాటః ౧, జలకంటకః ౨ కూటి కూర,

హిలమోచీ జలబ్రహ్మీ — హిలమోచీ ౧, జలబ్రహ్మీ ౨ తీగ బచ్చలి.

వాయసీ కాకమాచికా, — వాయసీ ౧, కాకమాచికా ౨ కామంచి చెట్టు.

పున్నాగః కేసరశ్చైవ — పున్నాగః ౧, కేసరః ౨ సురపొన్న చెట్టు.

చాంపేయో నాగకేసరః. — చాంపేయః ౧, నాగకేసరః ౨ నాగకేసర వృక్షము.

స్యాద్దోలికా చ హిందోలా — దోలికా ౧, హిందోలా ౨ ఉయ్యాల పేరులు.

లావణ్యం లవణం మతమ్. — లావణ్యం ౧, లవణం ౨ ఉప్పుపేరు.

సుఖాశో రాజతిమిషః — సుఖాశః ౧, రాజతిమిషః ౨ సుఖమగు భోజనము.

కటుకో రాజసర్షపః. — కటుకః ౧, రాజసర్షపః ౨ ఆవాలలో భేదము.

సితమాషో రాజమాషో — సితమాషః ౧, రాజమాషః ౨ అలచందలు.

మసూరో వ్రీహికాంచనః — మసూరః ౧, వ్రీహికాంచనః ౨ చిఱుసెనగలు.

మధుక్షీరస్తు ఖర్జూరః — మధుక్షీరః ౧, ఖర్జూరః ౨ కర్జూరపు చెట్టు.

శాలః శంకుతరుర్మతః. — శాలః ౧, శంకుతరుః ౨ ఏపెచెట్టు.

ముస్తో రాజకశేరుః స్యా — ముస్తః ౧, రాజకసేరుః ౨ తుంగముస్తె.

ద్రోహిణశ్చందనద్రుమః, — రోహిణః ౧, చందనద్రుమః ౨ గంధపుచెట్టు.

కాకమద్గుర్జలరంకః — కాకమద్గుః ౧, జలరంకః ౨ వాలుకొంగ.

కోయష్టిర్జలకుక్కుభః. — కోయష్టిః ౧, జలకుక్కుభః ౨ జలచరపక్షివిశేషము.

| | |
|---|---|
| వర్తికా విష్ణులింగీ స్యా | వర్తికా ౧, విష్ణులింగీ ౨ మీాలవల్లంకి పిట్ట. |
| ద్వనాఖు శ్శశకః స్మృతః, | వనాఖుః ౧, శశకః ౨ కుందేలు. |
| తామ్రకృమి రింద్రగోపో | తామ్రకృమిః ౧, ఇంద్రగోపః ౨ ఆర్ద్రపురుగు. |
| గృహగోధా గృహాలికా. | గృహగోధా ౧, గృహాలికా ౨ బల్లి. |
| దివాంధో హరినేత్రః స్యా | దివాంధః ౧, హరినేత్రః ౨ గుడ్లగూబ. |
| ద్గోనందీ లక్ష్మణా మతా, | గోనందీ ౧, లక్ష్మణా ౨ ఆఁడుబెగ్గురుపక్షి. |
| కురంకురః పుష్కరాఖ్యో | కురంకురః ౧, పుష్కరః ౨ మగబెగ్గురుపక్షి. |
| వాతులి స్తరుతూలికా. | వాతులిః ౧, తరుతూలికా ౨ సుడిగాలి. |
| కోలపుచ్ఛస్తు కంకః స్యా | కోలపుచ్ఛః ౧, కంకః ౨ రాంబందు. |
| ద్గర్గాటో యోగనాలికః. | గర్గాటః ౧, యోగనాలికః ౨ మత్స్యవిశేషము. |
| గ్రామ్యమద్గురికా శృంగీ | గ్రామ్యమద్గురికా ౧, శృంగీ ౨ బొమ్మడాయిచేప. |
| రాజశృంగస్తు మద్గురః, | రాజశృంగః ౧, మద్గురః ౨ మత్స్యవిశేషము. |
| పంకగ్రాహస్తు మకరః | పంకగ్రాహః ౧, మకరః ౨ మొసలి. |
| శఫరః శ్వేతకోలికః. | శఫరః ౧, శ్వేతకోలికః ౨ బేడిసచేప. |
| చింగటస్తు మహాశల్కః | చింగటః ౧, మహాశల్కః ౨ చింగటమత్స్యము. |
| పోతాధానం జలాండకం | పోతాధానం ౧, జలాండకం ౨ చిఱుమీాలగుంపు. |
| ఫలకీ తు చిత్రఫలీ | ఫలకీ౧, చిత్రఫలీ ౨ నడగడ్డిలోనిచేప. |
| మత్స్యరాజస్తు రోహితః. | మత్స్యరాజః ౧, రోహితః ౨ ఎఱ్ఱమీాను. |

| | |
|---|---|
| కాకోచికస్తు కాకోచీ | కాకోచికః ౧, కాకోచీ ౨ కాకోచిక మత్స్యము. |
| వకాచీ వకచించికా, | వకాచీ ౧, వకచించికా ౨ బకచించికామత్స్యము. |
| కవయీ క్రకచపృష్ఠీ. | కవయీ ౧, క్రకచపృష్ఠీ ౨ అంపపుతోఁకచేఁప. |
| ఖలేశస్తు ఖలేశయః. | ఖలేశః ౧, ఖలేశయః ౨ ఖలిశమను చేఁప. |
| ఇల్లిశో రాజశఫర | ఇల్లిశః ౧, రాజశఫరః ౨ ఇల్లిసెచేఁప పేరు. |
| ఇంచాకో జలవృశ్చికః, | ఇంచాకః ౧, జలవృశ్చికః ౨ నీరు తేలు. |
| దండపాలోఽర్ధశఫరః | దండపాలః ౧, అర్ధశఫరః ౨ తిమింగలభేదము. |
| కంకత్రోటో జలవ్యథః. | కంకత్రోటః ౧, జలవ్యథః ౨ గద్ద ముక్కుచేఁప. |
| లఘుగర్గస్త్రికంటః స్యా | లఘుగర్గః ౧, త్రికంటః ౨ ఏనుఁగు పల్లేరు వంటిచేఁప. |
| త్సితాంకో వాలుకాగడః | సితాంకః ౧, వాలుకాగడః ౨ వాలుకాగడమను చేఁప. |
| కనకపలం కురుబిస్తః | కనకపలం ౧, కురుబిస్తః ౨ నాలుగు కర్షములయెత్తు బంగారము. |
| కరికవలో విధానం స్యాత్. | కరికవలః ౧, విధానం ౨ ఏనుఁగున కిచ్చు ఆహారకబళము. |
| బ్రాహ్మీతు పంకగడకః | బ్రాహ్మీ ౧, పంకగడకః ౨ బురదమట్ట చేఁప. |
| శకులో దండపాలకః, | శకులః ౧, దండపాలకః ౨ నూఱామడల పొడవుచేఁప. |
| నిచోలకం నిచులకం, | నిచోలకం ౧, నిచులకం ౨ భటాదు చోళాదిసన్నాహము. |

| | |
|---|---|
| మందామణిరలింజరః. | మందామణిః ౧, అలింజరః ౨ పెద్ద బాన. |
| వేదిః స్థండిలసితకం | వేదిః ౧, స్థండిలసితకం ౨ అరుగు. |
| పన్యాటోనిష్కుటః స్మృతః, | పన్యాటః ౧, నిష్కుటః ౨ పైరు వేయుమడి. |
| లోపాసికా ఖంఖరీ స్యాత్ | లోపాసికా ౧, ఖంఖరీ ౨ ఆఁడునక్క. |
| పల్యాటో నిష్కుటః స్మృతః. | పల్యాటః ౧, నిష్కుటః ౨ ఉపవనము పేరు. |
| అంకేష్వేవాంకమంగాని స్మృతముత్తానముత్కుటం, | ఉత్తానం ౧, ఉత్కుటం ౨ వెల్లికిల పరుండుట. |
| స్యాన్మార్జితా రసాలా చ | మార్జితా ౧, రసాలా ౨ భక్ష్య విశేషము. |
| బుక్కారః సింహనాదకః. | బుక్కారః ౧, సింహనాదకః ౨ సింహనాదము. |
| కర్ణగూథం కర్ణమలం | కర్ణగూథం ౧, కర్ణమలం ౨ చెవిలోని గుబిలి. |
| సింఘాణం నాసికామలం | సింఘాణం ౧, నాసికామలం ౨ చీమిడి |
| దంతమలం పుష్పికా స్యాత్ | దంతమలం ౧, పుష్పికా ౨ పండ్లమీఁదిపాచి. |
| కులకం రసనామలం. | కులకం ౧, రసనామలం ౨ నాలుకపైనిపాచి. |
| కారంధమీ ధాతువాదీ | కారంధమీ ౧, ధాతువాదీ ౨ ధాతువాదమెఱిఁగినవాఁడు. |
| దరిద్రో దుర్విధః స్మృతః, | దరిద్రః ౧, దుర్విధః ౨ దరిద్రము. |
| స్యాన్మంత్రగండకోవిద్యా | మంత్రగండకః ౧, విద్యా ౨ విద్య. |
| పక్షద్వారం ఖడక్కికా | పక్షద్వారం ౧, ఖడక్కికా ౨ సింహద్వారమునకుఁగల చిన్నవాకిలి. |
| ఆర్ద్రవస్త్రం జలార్ద్రఃస్యా | ఆర్ద్రవస్త్రం ౧, జలార్ద్రః ౨ తడిసినవలువ. |

| | |
|---|---|
| దోషశ్చాదీనవో మతః. | దోషః ౧, ఆదీనవః ౨ దోషము పేర్లు. |
| యోజనం మార్గధేనుః స్యా | యోజనం ౧, మార్గధేనుః ౨ ఆమడ దూరము. |
| న్నల్వః కిష్కుచతుశ్శతమ్ | నల్వః ౧, కిష్కుచతుశ్శతమ్ ౨ నూరు బారలదూరము. |
| చోలకో వాణవారః స్యాత్ | చోలకః ౧, వాణవారః ౨ దూది బొంతచొక్కా. |
| కూర్పాసస్త్వర్ధచోలకః | కూర్పాసః ౧, అర్ధచోలకః ౨ చొక్కా. |
| నాగోదరమురస్త్రాణం | నాగోదరం ౧, ఉరస్త్రాణం ౨ కవచము. |
| జంఘాత్రాణం తు మంకుణం | జంఘాత్రాణం ౧, మంకుణం ౨ పిక్కలకవచము. |
| స్యాత్ప్రాసాదో దేవకులం | ప్రాసాదః ౧, దేవకులం ౨ దేవమందిరము. |
| తత్తు చైత్యం వినాముఖం | చైత్యం ౧, వినాముఖం ౨ బౌద్ధుల ఆలయము. |
| తృణపూలీ తు చంచా స్యా | తృణపూలీ ౧, చంచా ౨ గడ్డితోఁ గట్టిన మనుష్యునిబొమ్మ. |
| ద్యథార్థం తు యథా తథా | యథార్థం ౧, యథాతథా ౨ సత్యము. |
| ఆఘాతనం వధస్థానం | ఆఘాతనం ౧, వధస్థానం ౨ వధ్యస్థానము. |
| కారా బంధనివేశ్మని | కారా (స్త్రీ) ౧ బంధనివేశ్మని = చెఱసాల. |
| స్కంధాగ్నిః స్థూలకాష్ఠాగ్ని | స్కంధాగ్నిః ౧, స్థూలకాష్ఠాగ్నిః ౨ పెనుకొయ్యల గాల్చిన నిప్పు. |
| స్తృణాగ్నిస్తు భవేత్సమః, | తృణాగ్నిః ౧, సమః ౨ తృణాగ్ని. |
| ఇంగలస్తు కరీషాగ్ని | ఇంగలః ౧, కరీషాగ్నిః ౨ పిడకనిప్పు. |
| ర్జ్వరాగ్నిస్త్వాధిమన్యవః. | జ్వరాగ్నిః ౧, ఆధిమన్యవః ౨ జ్వరాగ్ని పేరు. |

శ్వశురః స్వామిజనకః — శ్వశురః ౧, స్వామిజనకః ౨ మగని తండ్రి.

సాధుధీర్వరవత్సలా, — సాధుధీః ౧, వరవత్సలా ౨ అత్త.

భగసార్థ స్తథా — భగసార్థః ౧, విద్ధః ౨ కుటిలునిపేర్లు.

హేలావుకోఽశ్వ విక్రయీ. — హేలావుకః ౧, అశ్వవిక్రయీ (న్. పు) ౨ గుఱ్ఱముల అమ్మువాఁడు.

గృహవిత్తో గృహపతి — గృహవిత్తః ౧, గృహపతిః ౨ గృహస్థుఁడు.

స్తుంబీపుష్పంలతాంబుజం — తుంబీపుష్పం ౧, లతాంబుజం ౨ సొర పూవు.

లోహికాథ రసోనిః స్యా — లోహికా ౧, రసోనిః ౨ లోహపాత్రము.

న్నిలింపస్త్రిదశః స్మృతః — నిలింపః ౧, త్రిదశః ౨ దేవతలు.

గండూపదీ భూలతాస్యా — గండూపదీ ౧, భూలతా ౨ ఎఱ్ఱలు.

న్మండరీఘుర్ఘురీ మతా, — మండలీ ౧ ఘుర్ఘురీ ౨ వాద్యవిశేషము.

స్వచ్ఛట్యంగులిసందేశో — స్వచ్ఛటిః ౧ అంగులిసందేశః ౨ చిటికెవేయుట.

లంఘనం చాపతర్పణమ్. — లంఘనం ౧, అపతర్పణం ౨ ఉపవాసము.

గజఢక్కా మదామ్నాతః — గజఢక్కా ౧ మదామ్నాతః ౨ ఏనుఁగుపైనుండు నగారా.

శృంగారో గజమండనం — శృంగారః ౧, గజమండనం ౨ గజాలంకారము.

ప్రతిమో రణరంకః స్యా — ప్రతిమః ౧, రణరంకః ౨ యుద్ధోత్సాహముగల ఏనుఁగు.

త్వాటకః కదరః సృణిః — వటకః ౧, కదరః ౨ సృణిః ౩ అంకుశము.

వీచీ జలలతా శ్రుండిః — వీచీ ౧, జలలతా ౨, శ్రుండిః ౩ తరంగము.

ఫేనాగ్రం బుద్బుదంవిదుః — ఫేనాగ్రం ౧, బుద్బుదం ౨ నీటిబుడగ.
జంబాలో జలకల్కఃస్యా — జంబాలః ౧, జలకల్కః ౨ బురద.
దారణిః కులహండకః. — ఆరణిః ౧, కులహండకః ౨ సుడి.
వినాకృతం విరహితం — వినాకృతం ౧, విరహితం ౨ విడువఁబడినది.
గండూషో ముఖపూరణే — గండూషః ౧, ముఖపూరణః ౨ పుక్కలించి వేయుట.
కాష్ఠమల్లః శవయానం — కాష్ఠమల్లః ౧, శవయానం ౨ పాడె.
కషాయస్తూవరోరసః. — కషాయః ౧, తూవరరసః ౨ వగరుతనము.
పర్వావధిః పరగ్రంథిః — పర్వావధిః ౧, పరగ్రంథిః ౨ వ్రేలికణుపు.
పింజోలా పత్రకాహలా, — పింజోలా ౧, పత్రకాహలా ౨ దర్భకుంచె.
గోహల్లంచ గలంగోవిట్ పరిఘోద్ధారకంటకః. ౨౦౭ — పరిఘః ౧, ఉద్ధారకంటకః ౨ ద్వారమునందుంచు లాటీకఱ్ఱ.
కర్కరంచూర్ణ ఖండేస్యా — కర్కరం ౧, చూర్ణఖండం ౨ సున్నముగా నగురాయి.
త్కర్కసారం కరంభకం — కర్కసారం ౧, కరంభకం ౨ పెరుగుతో తడిపిన పేలపిండి.
స్పర్ధాయామపి సంఘర్షః — స్పర్ధా ౧, సంఘర్షః ౨ తగవు.
కఠోరం కర్కరం విదుః. — కఠోరం ౧, కర్కరం ౨ కఠినమైనది.
వందీ కవరకీమాహు — వంది ౧, కవరకీ ౨ కొప్పువేళ్లు.
రాసందీ లఘుఖట్వికా, — ఆసంధీ ౧, లఘుఖట్వికా ౨ చవుకముగనుండు మంచమువంటిపీట (కట్లపీట)
ఘటరాజః స్మృతఃకుంభో — ఘటరాజః ౧, కుంభః ౨ కుండ.
గర్గరీ కలశీర్మతా. ౨౦౯ — గర్గరీ ౧, కలశిః ౨ పెరుగు తఱచు కుండ.

విదురంజన్యముత్పాతం అంజన్యం ౧, ఉత్పాతం ౨ఉత్పాతము వేళు.

నిర్ఘాతే వ్యోమముద్గరః నిర్ఘాతః ౧, వ్యోమముద్గరః ౨ పిడుగు.
పర్యంతికా గుణభ్రంశో పర్యంతికా ౧, గుణభ్రంశః ౨ గుణ నాశనము.

గాంగేష్ఠీకటశర్కరా. గాంగేష్ఠీ ౧, కటశర్కరా ౨ ముత్య పుతీఁగ.

ఉల్కా కులుక్క గుంజా ఉల్కా ౧, కులుక్క గుంజా ౨ ఉ
స్యా లాకాగ్ని (తోఁకచుక్క)
త్కులక్క స్తాలమర్దలః, కులక్కః ౧, తాలమర్దలః ౨ వాద్య విశేషము.

సూత్రకోణే డమరుకం సూత్రకోణం ౧, డమరుకం౨ డమరు.
సూత్రవీణా చ లావుకీ, సూత్రవీణా ౧, లావుకీ ౨వీణాభేదము.
మేలానందో మసీమణి మేలానందః ౧, మసీమణిః ౨సిరాబుడ్డి.
ర్లేఖనీ వర్ణతూలికా, లేఖనీ ౧, వర్ణతూలికా ౨ కలము (కుంచె)

ధాతూఫలః కఠినికా ధాతూపలః ౧, కఠినికా ౨ జేగురు తాయి.

మేలా పత్త్రాంజనం మసిః మేలా ౧, పత్త్రాంజనం ౨, మసిః 3 సిరా.

తర్కుటీ సూత్రలా తర్కు తర్కుటీ ౧, సూత్రలా ౨, తర్కుః 3 రాటము.

ర్ఝల్లోల స్తర్కులాసకః, ఝల్లోలః ౧, తర్కులాసకః ౨ కదురు క్రిందనుంచు చిప్ప.

వర్తులా తర్కుపీఠీస్యా వర్తులా ౧, తర్కుపీఠీ ౨ రాటము అడుగుచట్టము.

త్పంజికా తూలనాలికా. పంజికా ౧, తూలనాలికా ౨ నూలు కండెపేరు.

నిర్వేష్టనం నాడిచీరం నిర్వేష్టనం ౧, నాడిచీర ౨ కండె దారము.

దగ్ధేష్టకా స్యాజ్ఝామకం, — దగ్ధేష్టకా ౧, ఝామకం ౨ కాల్చిన యిటుక.

దోలా ప్రేంఖా పుమాన్. ప్రేంఖో, — దోలా ౧, ప్రేంఖా ౨, ప్రేంఖః 3 చౌత అను డోలి

వారాసనం వాస్సదనం. — వారాసనం ౧, వాస్సదనం ౨ జలగృహము.

పిష్టవర్తిస్తు చమస — పిష్టవర్తిః ౧, చమసః ౨ సోమరసము త్రాగు పాత్ర.

శ్చిత్రాపూపశ్చమప్రణ — చిత్రాపూపః ౧, చమప్రణః ౨ పిండివంట భేదము.

మ్లేచ్ఛితం పరభాషాయాం — మ్లేచ్ఛితః ౧,పరభాషాయాం=పరభాష.

లుంటికా న్యాయసారిణీ. — లుంటికా ౧, న్యాయసారిణీ ౨ యుక్తిగా పనిచేయు స్త్రీ.

శూకాపూట్ల స్తృణామణి — శూకాపూట్లః ౧, తృణమణిః ౨ నీలము (తృణగ్రాహిరత్నము.)

శ్ఛాత్రగండః పదాద్యవిత్, — ఛాత్రగండః ౧, పదాద్యవిత్ ౨ విభక్త్యంతములగు శ్లోకముల ఆది యెఱింగినవాఁడు.

కోశకారః కాష్ఠతంతుః — కోశకారః ౧, కాష్ఠతంతుః ౨ పట్టుపురుగు.

ఘుణకాల స్యాత్కాష్ఠలేఖకః. ౨౧౬ — ఘుణకాల ౧ కాష్ఠలేఖకః ౨ కొయ్యతొలుచు పురుగు.

విషశృంగి భృంగరోలో — విషశృంగీ (న్. పు) ౧, భృంగరోలః ౨ కొమ్ములపురుగు.

వరోల స్తృణషట్పదః, — వరోలః ౧, తృణషట్పదః ౨ తుమ్మెదలో భేదము.

తుటుమోరంధ్రబభ్రుస్స్యా ద్వినాలింగాలికా స్మృతా. — తుటుమః ౧, రంధ్రబభ్రుః ౨ ఎలుక.

భశావిదారుః క్రకచపాదో — భశా ౧, విదారుః ౨, క్రకచపాదః 3 తొండ,

| | |
|---|---|
| ద్రుణశ్చాలిశ్చ వృశ్చికః | ద్రుణః ౧, అలిః ౨ వృశ్చికః ౩ తేలు. |
| పద్మాక్షం పద్మబీజం చ | పద్మాక్షం ౧, పద్మబీజం ౨ తామర గడ్డలోని విత్తులు. |
| కర్ణికా బీజమాతృకా. | కర్ణికా ౧, బీజమాతృకా ౨ తామర పూవులోనిగడ్డె. |
| రంగమాతా భవేల్లాక్షా | రంగమాతా ౧, లాక్షా ౨ లత్తుక (లక్క.) |
| ధీలటిర్దుహితా మతా, | ధీలటిః ౧, దుహితా ౨ కుమార్తె. |
| చాటలోలశ్చటుల్లోలో | చాటలోలః ౧,చటుల్లోలః ౨ ప్రియోక్తులం దాసక్తిగలవాఁడు. |
| జేంగటో దోహదః స్మృతః | జేంగటః ౧, దోహదః ౨ గర్భిణ్యాభిలాష. |
| ధాతాంజలీ ధాతబలీ | ధాతాంజలీ ౧, ధాతబలీ ౨ శుభ్రముగాఁ గడిగినదోసిలి. |
| వజ్రకం దుగ్ధపాచనం, | వజ్రకం ౧, దుగ్ధపాచనం ౨ పాలు కాచుపాత్రము. |
| చిత్రోక్తిః పుష్పశకటీ చాసేచనమతృప్తికృత్. | చిత్రోక్తిః ౧, పుష్పశకటీ ౨ ఆకాశవాణి. |
| కాలరాత్రిర్భీమరథీ | కాలరాత్రిః ౧, భీమరథీ ౨ కాలరాత్రి. |
| అస్వాధ్యాయో నిరాకృతిః | అస్వాధ్యాయః ౧, నిరాకృతిః ౨ వేదపఠనము చేయనిబ్రాహ్మణుఁడు. |
| బ్రహ్మవాదః శ్రుతాదానం | బ్రహ్మవాదః ౧, శ్రుతాదానం ౨ బ్రహ్మవాదము. |
| విశ్వకద్రుర ఖేటికః. ౨౨౧ | విశ్వకద్రుః ౧, అఖేటికః ౨ వేఁట కుక్క. |
| హింసాలుకః ఖాదుకశ్చ | హింసాలుకః ౧, ఖాదుకః ౨ జంతువుల చంపుకుక్క ఖలుఁడు. |
| యోగితోఽలర్క ఇష్యతే | యోగితః ౧, అలర్కః ౨ పిచ్చికుక్క. |
| ద్రగడస్తూర్యగంజా స్యా | ద్రగడః ౧, తూర్యగంజా ౨ వాద్యవిశేషము. |

| | |
|---|---|
| దాదర్శో ముకురః స్మృతః | ఆదర్శః ౧, ముకురః ౨ అద్దము. |
| రాహూత్సృష్టో రసోనః స్యా | రాహూత్సృష్టః ౧,రసోనః ౨ రాహు ముక్తమగు సూర్య చంద్రగ్రహములు. |
| దంగరీ కోలనాసికా, | అంగరీ ౧, కోలనాసికా ౨ బంకిణీ వృక్షము. |
| మయటస్తృణహర్మ్యంస్యా | మయటః ౧, తృణహర్మ్యం ౨ గడ్డితోఁ గట్టిన గృహవిశేషము. |
| త్కుత్రం గోమం చ మండపః. ౧౨౩ | కుత్రం ౧, గోమం ౨, మండపః ౩ మండపము పేరులు. |
| ప్రవద్రంగః పణగ్రంథి | ప్రవద్రంగః ౧, పణగ్రంథిః ౨ అంగడివీథి. |
| శ్చిత్తికా కటిశృంఖలా, | చిత్తికా ౧, కటిశృంఖలా ౨ నడుమునకు కట్టుగొలుసు. |
| విశారదః ప్రసిద్ధే స్యాత్ | విశారదః ౧, ప్రసిద్ధః ౨ ప్రసిద్ధుఁడు. |
| శ్రీర్లక్ష్మీరిందిరా మతా. | శ్రీః ౧, లక్ష్మీః ౨, ఇందిరా ౩ లక్ష్మీదేవి. |

సమాప్తము.

శ్రీ

# ఏకాక్షరీకోశము

సటీకము.

అకారో వాసుదేవస్స్యా| అః. (పు) ౧ విష్ణువు.
దాకారస్తు పితామహః, ఆః (పు) ౧ బ్రహ్మ, ౨ పూజ, 3 మం
పూజాయామపి మాంగల్యే గళసూత్రము.
ఆకారః పరికీర్తితః. ౧
ఈకార ఉచ్యతే కామో ఈః (పు) ౧ మన్మథుఁడు, సీ. ౨లక్ష్మి.
లక్ష్మీరీకార ఉచ్యతే,
ఉకారశ్శంకరః ప్రోక్త ఉః (పు) ౧ శంకరుఁడు.
ఊకారశ్చాపి లక్షణే. ౨ ఊః (పు) ౧ లక్షణము, ౨ రక్షిం
రక్షణే చాపి ఊకారః ఊ చుట, 3 బ్రహ్మ.
కారో బ్రహ్మణి స్మృతః, [త్
ఋకారో దేవమాతాస్యా ఋ (సీ) ౧ అదితి.
ౠకారోదనుజప్రసూః. ౠ (సీ) ౧ దితి.
ఌకారో దేవజాతీనాం ఌః (సీ) ౧ దేవమాత (అదితి), పు ౨
మాతా స్వః ప్రకీర్తితః, స్వర్గము.
ౡకారస్స్మర్యతే పూర్వై ౡ (సీ) ౧ తల్లి.
ర్జననీ శబ్దకోవిదైః. ౪
ఏకార ఉచ్యతే విష్ణు ఏ (పు) విష్ణువు.
రైకారఃస్యాన్మహేశ్వరః ఐ (పు) ౧ మహేశ్వరుఁడు.
ఓకారస్తు భవేద్బ్రహ్మా. ఓ (పు) ౧ బ్రహ్మ.
ఓంకారోఽనంత ఉచ్యతే ఓం (పు) పరాత్పరుఁడు.
అం స్యాచ్చ పరమంబ్రహ్మ అం (న) ౧ పరబ్రహ్మస్వరూపము.
అః స్యాచ్చైవ మహే అః (పు) ౧ శివుఁడు.
శ్వరః

| | |
|---|---|
| కః ప్రజాపతిరుద్దిష్టో కోఽర్కః వాయ్వనలేషు చ. ౬ కశ్చాత్మని మయూరే చ | కః (పు) ౧ బ్రహ్మ, ౨ సూర్యుఁడు, 3 వాయువు, ౪ అగ్ని. |
| కః ప్రకాశ ఉదాహృతః, | కః (పు) ౧ ఆత్మ, ౨ నెమిలి, 3 కాంతి. |
| కం శిరో జలమాఖ్యాతం కం సుఖం చ ప్రకీర్తితమ్. ౭ | కం (న) ౧ తల, ౨ నీరు, 3 సుఖము. |
| పృథివ్యాం కుః సమాఖ్యాతః కుః శబ్దేఽపి ప్రకీర్తితః, | కుః (స్త్రీ) ౧ భూమి. |
| ఖమింద్రియే ఖమాకాశే ఖః స్వర్గేఽపి ప్రకీర్తితః. ౮ | ఖం (న) ౧ ఇంద్రియము, ౨ ఆకాశము, 3 స్వర్గము. |
| సామాన్యే చ తథా శూన్యే ఖశబ్దః పరికీర్తితః, | ఖః (పు) ౧ సామాన్యమైనది, ౨ అభావము. |
| గో గణేశ స్సముద్దిష్టో గంధర్వో గః ప్రకీర్తితః. ౯ | గః (పు) ౧ వినాయకుఁడు, ౨ గంధర్వుఁడు. |
| గం గీతం | గం (న) ౧ గానము. |
| గా చ గాథా స్యాత్ | గా (స్త్రీ) ౧ పూర్వకథ. |
| గౌశ్చ ధేనుః సరస్వతీ | గౌ. స్త్రీ ౧ ఆవు, ౨ సరస్వతి. |
| ఘా ఘంటాథ సమాఖ్యాతా ౧౦ | ఘా (స్త్రీ) ౧ గంట. |
| ఘో ఘనశ్చ ప్రకీర్తితః. | ఘః (పు) ౧ (మేఘము) |
| ఘుంటీశే హననే ఘుర్ణే | ఘుః పు. ౧ చిఱుగంటలు, ౨ సంహారము, 3 వేడిమి. |
| ఘుర్ఘోణా | ఘుః (పు) ౧ పందిముట్టె. |
| ఘూర్ధ్వనావపి, | ఘూః (పు) ధ్వని. |
| జకారో భైరవః ఖ్యాతో జకారో విషయస్పృహా. ౧౧ | జః (పు) ౧ భైరవుఁడు, ౨ విషయవాంఛ. |
| చశ్చంద్రమాః సమాఖ్యాతః భాస్కరే తస్కరే మతః, | చః (పు) ౧ చంద్రుఁడు, ౨ సూర్యుఁడు, 3 దొంగ. |
| నిర్మలం ఛం సమాఖ్యాతం | ఛం (న) ౧ పరిశుద్ధము. |

తరలే ఛః ప్రకీర్తితః.౧౨
ఛేదకే ఛః సమాఖ్యాతః
విద్వద్భిః శబ్దకోవిదైః,

ఛః(పు)౧నాయకమణి,౨కోయువాఁడు.

జకారో గాయనే ప్రోక్తో
జయనే జః ప్రకీర్తితః. ౧౩
జేతా జశ్చ ప్రకథితః సూ
రిభిః శబ్దశాసనైః,

జః (పు) ౧ పాటపాడువాఁడు, ౨ జయము, ౩ జయించువాఁడు.

రవో ఝకారః కథితః న
ష్టే ఝశ్చోచ్యతే బుధైః.౧౪
ఝకారశ్చ తథా వాయౌ
నేపథ్యే సముదాహృతః,

ఝః (పు) ౧ ధ్వని, ౨ నశించినది, ౩ వాయువు, ౪ అలంకారము.

ఞకారో గాయనే ప్రోక్తో
ఞకారో ఝర్ఝరధ్వనౌ. ౧౫

ఞః (పు) ౧ పాటకుఁడు, ౨ ఝర్ఝర మను ధ్వనిపేరు.

టో ధరిత్ర్యాం చ కరకే
టో ధ్వనౌ చ ప్రకీర్తితః,

టః (పు) ౧ భూమి (స్త్రీ), ౨ పు. వడ గండ్లు, ౩ ధ్వని.

ఠకారో జనతాయాం
స్యాత్ ఠో ధ్వనౌ చ శఠేఽపి
చ. ౧౬
ఠో మహేశః సమాఖ్యాతః
ఠశ్చ శూన్యే ప్రకీర్తితః, బృ
హద్ధ్వనౌ చ ఠః ప్రోక్తః తథా
చంద్రస్య మండలే. ౧౭

ఠః (పు) ౧ జనుఁగుంపు, ౨ ధ్వని, ౩ మూర్ఖుఁడు, ౪ శంకరుఁడు, ౫ శూన్యము, ౬ గొప్పధ్వని, ౭ చంద్రమండలము.

డకారః శంకరే త్రాసే ధ్వ
నౌ భీమే నిరుచ్యతే,

డః (పు) ౧ శివుఁడు, ౨ భయము, ౩ ధ్వని, ౪ భీముఁడు.

ఢకారః కీర్తితా ఢక్కా
నిర్గుణే నిర్ధనే మతః. ౧౮

ఢః (పు) ౧ గుణరహితుఁడు, ౨ దరిద్రుఁడు, ౩ భేరి.

ణకారః సూకరే జ్ఞానే
నిశ్చయే నిర్ణయేఽపి చ,

ణః (పు) ౧ వరాహము, ౨ జ్ఞానము, ౩ సత్యము, ౪ నిర్ణయము.

తకారః కీర్తితశ్చోరే క్రో
డపుచ్ఛే ప్రకీర్తితః. ౧౯

తః (పు) ౧ దొంగ, ౨ పందితోఁక.

శిలోచ్చయే థకారః స్యా     థః (పు) ౧ కొండ, ౨ నీతికాపాడుట.
త్థకారో నయరక్షణే,
దకారో ఒద్రౌకళత్రే చ|     దః (పు) ౧ ఆకాశము, ౨ భార్య(స్త్రీ)
ఛేదే దానే చ దాతరి. ౨౦ 3 ఖండించుట, ౪ ఇచ్చుట, ౫ దాత.

ధం ధనే సధనే     ధం (న) ౧ ధనము. ధని
ధః స్యాద్విధాతరి మనావపి,     ధః (పు) ౧ బ్రహ్మదేవుఁడు, ౨ మనువు.
ధిషణా ధీ సమాఖ్యాతా     ధీః (స్త్రీ) ౧ బుద్ధి.

ధూశ్చైవం భారవిత్త     ధూః (స్త్రీ) ౧ బరువు, ౨ ధనము.
యోః. ౨౧
నేతా నశ్చ సమాఖ్యాతః     నః (పు) ౧ అధిపతి, ౨ పడవ, 3 బౌ
తరణౌ నః ప్రకీర్తితః, నకారః ద్ధశాస్త్రవేత్త, ౪ బుద్ధుఁడు, ౫ స్తోత్రము,
సౌగతే బుద్ధౌ స్తుతౌ వృక్షే ౬ వృక్షము, ౭ స్వాగతము, ౮ చుట్టము,
ప్రకీర్తితః. ౨౨ నశబ్దః స్వాగ ౯ చెట్టు, ౧౦ సూర్యుఁడు.
తే బంధౌ వృక్షే సూర్యే చ
కీర్తితః.
పః కుబేరః సమాఖ్యాతః     పః (పు) ౧ కుబేరుఁడు, ౨ పడమటి
పశ్చిమే చ ప్రకీర్తితః. ౨౩ దిక్కు, 3 వాయువు, ౪ త్రాఁగుట, ౫
పవనే పస్సమాఖ్యాతః పః పాలించువాఁడు.
స్యాత్పానే చ పాతరి,
కఫే వాతే ఫకారః స్యా     ఫః (పు) ౧ పిలుచుట, ౨ కఫము, 3
త్తథాహ్వానే ప్రకీర్తితః. వాతము, ౪ ఫూత్కారము, ౫ నిరర్థక
౨౪. ఫూత్కారేఽపి చ సంభాషణము.
ఫః ప్రోక్తస్తథా నిష్ఫలభా
షణే,
బఙ్కారే వరుణః ప్రోక్తః     బః (పు) ౧ వరుణుఁడు, ౨ కలశము,
కలశే బః ఫలేఽపి చ. ౨౫. 3 పండు, ౪ వక్షస్స్థలము, ౫ గదాయు
వక్షస్థ్సలే చ బః ప్రోక్తో గదా ధము (స్త్రీ).
యాం సముదాహృతః.

నక్షత్రే భం బుధాః ప్రా    భం. (న) ౧ నక్షత్రము.
హుః
భవనే భః ప్రకీర్తితః ౨౬    భః (పు) ౧ గృహము.
దీప్తి ర్భా స్యాచ్చ    భా (స్త్రీ) ౧ కాంతి.
భూర్భూమి    భూః (స్త్రీ) ౧ భూమి.
ర్భీర్భయం కథితం బుధైః,    భీః (స్త్రీ) ౧ భయము
మః శివశ్చంద్రమా వేధా    మః (పు) ౧ శివుఁడు, ౨ బ్రహ్మ.
మా లక్ష్మీ చ ప్రకీర్తితా.    మా (స్త్రీ) ౧ లక్ష్మి, ౨ తల్లి, 3 అభి
౨౭. మా చ మాతరి మానే చ    మానము.
బంధనే మః ప్రకీర్తితః,    మః (పు) ౧ బంధనము.
యశో యః కథితః ప్రాజ్ఞైః    యః (పు) ౧ కీర్తి, ౨ వాయువు, 3
యో వాయురితి శబ్దితః. ౨౮    ప్రయాణము, ౪ పోవువాఁడు, ౫ త్యా
యానే యాతరి యస్త్యాగే కథి    గము.
తశ్శబ్దవేదిభిః.
రశ్చ రామేఽనిలే వహ్నౌ    రః (పు) ౧ రాముఁడు, ౨ వాయువు,
భూమావపి ధనేఽపి చ. ౨౯    3 అగ్ని, ౪ భూమి, ౫ ధనము, ౬ ఇం
ఇంద్రియే ధనరోధే చ    ద్రియము, ౭ ధనాటంకము.
రుర్భయే చ ప్రకీర్తితః,    రుః (పు) ౧ భయము.
లో దీప్తౌ ద్యాం లశ్చ    లః (పు) ౧ కాంతి, ౨ ఆకాశము,
భూమౌ భయే చాహ్లాదనేఽ    3 భూమి, ౪ భయము, ౫ సంతోషము,
పి చ. ౩౦. లో వాతే లవణే    ౬ గాలి, ౭ లవణము, ౮ దానము, ౯
చ స్యాల్లో దానే చ ప్రకీ    ఆలింగనము, ౧౦ తలపు, ౧౧ ప్రళయ
ర్తితః, లః శ్లేష చాశయే    ము, ౧౨ సాధనము, ౧౩ మనస్సు, ౧౪
చైవ ప్రలయే సాధనేఽ    ఓదార్చుట.
పి లః. ౩౧. మానసే వరుణే
చైవ లకారస్సాంత్వనేఽపి
చ,
విశ్చ పక్షీ నిగదితో గగ    విః పు ౧ పక్షి, ౨ ఆకాశము.
నం ప్రతికీర్తితమ్,    ౩౨

| | |
|---|---|
| శం సుఖం శంకరః శ్రే యః శశ్చ సీమ్ని నిగద్యతే, | శం. న. ౧ సుఖము, ౨ శివుఁడు, (పు) 3 శ్రేయస్సు. |
| శయనే శః సమాఖ్యాతః హింసాయాం శో నిగద్యతే. | శః పు. ౧ సీమ, ౨ శయనము, 3 హింస. |
| షః కీర్తితో బుధైః శ్రేష్ఠే షశ్చ గంభీరలోచనే, ఉపసర్గేఽపరోక్షే చ షకారః పరికీర్తితః. 3౪ | షః (పు) ౧ ఉత్తముఁడు, ౨ గంభీర దృష్టిశాలి, 3 ఉపద్రవము, ౪ చాటు. |
| సః కోపే వరణే సః స్యాత్ తథా శూలిని కీర్తితః, | సః (పు) ౧ కోపము, ౨ ప్రాకారము 3 శివుఁడు. |
| సా చ లక్ష్మీ బుధైః ప్రోక్తా గౌరీ చ | సా (స్త్రీ) ౧ లక్ష్మి, ౨ పార్వతి. |
| స ఈశ్వరః. 3౫ | సః (పు) ౧ శంకరుఁడు. |
| హః కోపే వారణే హశ్చ తథా శూలీ ప్రకీర్తితః, | హః (పు) ౧ కోపము, ౨, ఏనుఁగు 3 దివసము, ౪ శివుఁడు. |
| హిః పద్యావరణే ప్రోక్తో హీః స్యాద్ధేత్వవధారణే. 3౬ | హిః (పు) ౧ పద్యావరణము, ౨ కారణము, 3 నిశ్చయము. |
| క్షః క్షేత్రే వక్షసి ప్రోక్తో బుధైః క్షః శబ్దశాసనే | క్షః (పు) ౧ క్షేత్రము, ౨ వక్షస్థలము, 3 వ్యాకరణశాస్త్రము. |
| క్షిః క్షేత్రే క్షత్రరక్షే చ నృసింహే చ ప్రకీర్తితః. | క్షిః (పు) ౧ క్షేత్రము, ౨ క్షాత్ర సంరక్షణము, 3 నృసింహస్వామి. |
| ఆగమేభ్యోఽభిధానేభ్యః ధాతుభ్యః శబ్దశాసనాత్, ఏవమేకాక్షరం నామాభిధానం క్రియతే మయా. 3౭ | శాస్త్రములనుండియు నామధేయముల నుండియు ధాతువులనుండియు వ్యాకరణ శాస్త్ర సంబంధమునుండియు ఏకాక్షర నామములు నాచే సమకూర్పఁబడెను. |

సమాప్తము.

హా రా వ

# శబ్దానుక్రమణిక.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.

# త్రికాండశేషము, సటీకము.

ఈ గ్రంథమునకు "అమరశేషము" అనికూడ నామాంతరము గలదు. ప్రసిద్ధులగు పండితులు చిరకాలము పరిశ్రమచేసి పెక్కుమాతృకలసాయమున దీని సవరించి నిర్దుష్టము గావించి, చక్కని తెలుగుటీకను వ్రాసి గ్రంథముయొక్క [illegible]నను మఱింత హెచ్చించిరి. ఈనిఘంటువునం దమరకోశమునం జేర్పక్కనని పర్యాయపదము లెన్నియో యున్నవి. ఇయ్యది గీర్వాణభాషాభ్యాసకుల కవశ్య పఠనీయ మగు గ్రంథరాజము. గ్రంథాంతమున అకారాదిశబ్దానుక్రమణికకూడం జేర్పబడియున్నది. చక్కగా ముద్రితమై మంచిబయిండు కట్టబడియున్నది. ప్రతి ౧-కి రూ.

# విశ్వకోశము, సటీకము.

ఇయ్యది మహేశ్వరసూరివిరచితమగు నొక ప్రాచీనసంస్కృతనిఘంటువు. చిరకాలముగా నీయుద్గ్రంథము మనయాంధ్రవిద్యార్థులకు దుష్ప్రాపమగా నున్నందున నాలోపమును వారింపఁబూని, పెక్కుముద్రితాముద్రితమాతృకలసాయమున మూలగ్రంథమును బరిశోధించి, సుప్రసిద్ధులగుపండితులంగొని సరళమగు తెనుఁగుటీకయు వ్రాయించి శుద్ధముగా నీపుస్తకమును బ్రచురించితిమి. ఈనిఘంటువునందు పదములెల్లను అంత్యాక్షరనియమము ననుసరించి అకారాదిగా వ్రాయఁబడియుండుటవలన, ఆవశ్యకము లగుపదములను సులభముగాఁ గనుఁగొనుట కెంతయు ననుకూలించియున్నది. ఇయ్యది శ్లోకరూపమగు నీగ్రంథమునందలి యొక గొప్పవిశేషము. ప్రతిసంస్కృతవిద్యార్థియు దీని జదివితీరవలయును. చక్కఁగా ముద్రితమై మంచి బయిండు కట్టఁబడియున్నది.
ప్రతి ౧-కి రూ. 2 ౦

# మేదినీకోశము, సటీకము.

ఈ గీర్వాణభాషానిఘంటువు మేదినీకరునిచే విరచితమైనది. ప్రాచీనములగు నిఘంటుగ్రంథములలో నిదియు నొకటియై యొప్పారుచున్నది. ఇయ్యది శ్లోకరూపమగు నిఘంటువైనను పదములెల్ల నంత్యాక్షరనియమము బాటించి అకారాదిగా వ్రాయఁబడియున్నందున గోరినపదము నుత్తరక్షణమునఁ బుస్తకమునందుఁ జూచి కనుఁగొనుట కుపకరించుచున్నది. ఇట్టియుపయోగకరమగు గ్రంథము మనయాంధ్రవిద్యార్థులెల్లరును బఠించి గీర్వాణశబ్దజ్ఞానమును సంపాదించుకొనవలయునన్న యుద్దేశముతో వ్యయప్రయాసములకోర్చి విఖ్యాతులగుపండితులఁగొని పెక్కుమాతృకలసాయమున గ్రంథమును సవరింపించి చక్కని తెనుఁగు టీకను వ్రాయించి ప్రచురించియున్నారము. గ్రంథము చక్కఁగా ముద్రింపఁబడి మంచి బయిండు కట్టఁబడియున్నది. ప్రతి ౧-కి రూ. 4 0

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.